ఓం.

# శ్రీ కుశలవ విజయము

ఇయ్యది

విశాఖపట్టణముజిల్లా, అనకాపల్లి వాసుండగు

బీ. బాలాజీదాసునిచే

హరికథగా వ్రాయబడినది.

6వ కూర్పు : 1000 ప్రతులు.


ప్రకటనకర్త :

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.





1935.

*Price Re.* **0–8–0.** [వెల రు **0–8–0.**

ఓం

# శ్రీ కుశలవవిజయము.

## హరికథ.

ఇయ్యది

విశాఖపట్టణముజిల్లా అనకాపల్లి వాసుండగు

బి. బాలాజీదాసునిచే

వ్రాయఁబడినది.



ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్‌డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

6 వ కూర్పు : 1000 ప్రతులు.

బెజవాడ ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.



*Re-print.*

1935





Price Re. 0-8-0 వెల రూ. 0-8-0



ఓం

# శ్రీ కుశలవవిజయము

## హరికథ.



సీ॥ ఎవ్వానినామంబు నేప్రొద్దుభజియించి అతిధన్యయయ్యె నా యాది శక్తి। ఎవ్వాని నావపై నెక్కించి యొడ్డునకుం జేర్చి పొందె నా గుహుఁడు ముక్తి। ఎవ్వాని పదునాలుగేండ్లరణ్యములో వసింప జేసెను కైకచేటియుక్తి। ఎవ్వాని సద్రూప మీయకొనగ జేసె సకల మౌనులకు సంసారరక్తి।

గీ॥ శబరి యిచ్చిన పండు లేసాఁబె మెక్కె
నింద్రనందనకంధర మెవఁడు డెక్కె
వసుమతీజాత పాద మెవ్వండు ద్రొక్కె
నట్టి రఘురామచంద్రు నే నాశ్రయింతు.

### — గురుస్తుతి —

కం॥ తగ నాంధ్రభాషగరపిన
తగవరి పోట్నూరుకులసుధావార్ధి విధుం
డగు వెంకటసామి మదీ
య గురుని మదిలో దలంతు ననవరతంబున్.

### — కవి వంశావళి —

సీ॥ ఫల సస్యవృద్ధి సద్వ్యాపారములచేత మను అన్నపల్లి గ్రామ నిల యుండ। గురుభరద్వాజసగోత్రప్రపావన ప్రభుఁడు లక్ష్మణదాసపౌత్ర

కుండ । రహిమిాజ కేశవరామామాఖ్యునకు గన్నమాంబకు నే ద్వితీయాత్మజుండ । విశ్రుతగానప్రవీణుడౌ బాలాప్రసాదుగారికి నే సహోదరుండ.

గీ॥ శైలజాహృదయాబ్జ భాస్కరకటాక్ష
వీక్షణప్రాప్త గాన కవిత్వయుతుడ
శ్రీరమేశకథాబోధనారతుండ
నరయ బాలాజిదాస నామాంకితుండ.

---

# కథాప్రారంభము.



రా— (సీత నవలోకించి)

కాంభోజి — చతురశ్రగతి

హరికరుణారసమువలన నబలా! హాయిగనున్నారమింతవరకు ॥హ॥
విరిబోణి! సత్పుత్రునిగనుమా । పితృఋణ దీర్చ ముదము
గూర్చ ॥హరి॥
దేనిమిాద నీకు గోర్కెగలదో । దెల్పుము నెరవేర్చెద ననుమానము
మాను మసురసంతతి ననిలో బరిమార్చి మన మయోధ్యకు
నరుదెంచి ॥హరి॥

సీ— (రామునిగాంచి)

హిం॥ తోడి — త్ర్యశ్రగతి

మనవి విను మో ప్రియా!
చనువుండుటచే దెల్ప । సాహసించితినో ప్రియా! ॥మ॥
మునిసువాసినులతో నాడు । కోన వేడుకజనించె
గనుక తదీప్సితము శ్రీరఘు కాలములో దీర్పుడు ॥మ॥

రా— జానకీ! తగుపర్పాటుచేసెదను.

(చాకలిదంపతులు — జోగి, మూలయ్య)

బేహాగ్ — చతురశ్రగతి.

—మాసినబట్టలను దెమ్మన । మంచిదనుచునేగి
యేసంగతి మాట్లాడుచుంటివో । యీతడవయేజోగి! ॥మా॥
ఎన్నండనరాని మాటల । నిట్లాడుట మేలా
విన్నవార లేమనుకుందురు నీ । వివేకంబు కాల॥ ॥యె॥
—మాటకుమారాడ్మాట లాడెదవు । మగువ మూయునోరు
బోటీ! వినునీటక్క రతనమును । జూచితి పలుమారు ॥మా॥
అపకీర్తులు చాల నావలన । నబ్బ నేల నీకు
నిపుడరిగెద బుట్టినింటి కింకొక । యింతిని గొని సాకు ॥అ॥
—నన్ను భయపెట్టెదవేల? నీవుగాకున్న
నీ కెట్టులో? నాకట్టులే (పుట్టినింటి కేగె)
—అమ్మాయీ! నీరాక వింతగానున్నది కారణమేమి?

— హిం॥ తోడి-త్ర్యశ్రగతి.

ఓపలేనేతల్లి! యీ కాపురమున కొకదండ ॥మో॥
ఏపాపం బెరుగని న । న్నే మోయని త్రాగి వచ్చి
చీపురు కట్టతో నన్ను । జితకమొత్తుచుండునే ॥మో॥

— ఝంఝూటి—త్ర్యశ్రగతి.

అల్లుడా! నీకిట్టులాడుట చెల్లునా? ॥అల్లు॥
పిల్లముద్దరాలు దాని । నల్ల తప్పు గానరా ॥డల్లు॥
ఆడరాని మాట । లాడి కొట్టితివట
యీడువారిలో దాని । నేమో తిట్టితివట ॥అల్లు॥
—అత్తా! నన్నేల నిదించెదవు?

ఉ॥ లోపము లెన్ని మోగలవు లోలమనస్క భవత్కుమారి సే
నోపగజాల దానికతినోక్తుల జిక్కుల నక్కటా మగల్
కోపముచూపునట్టితెరి క్రోధము లూరక యుండి భర్తకున్

గోప మడంగజూచి యనుకూలపుమాటల నాడి మెల్లగా
దాపునజేరి సేవలు ముదంబునజేయును రుత్తమాంగనల్॥

లచ్చి——మొదటి తప్పుగాదలంచి భార్య నేలుకొనుము.

మూ——అత్తా! ఇంతటితో దానికి నాకు రుణముచెల్లినది. ఇంటబెట్టి
కొని నీ యిష్ట ప్రకారము జరుపుకొనుము.

లోకులు——మూలిగా! నీ తెలివి తగలబెట్టినట్లున్నది- రావణుచెంత
నొక్కయేడు వసించిన జానకిని దెచ్చి మనయేలికచేపట్టలేదా?

మూ——(రోషముతో) చాలు చాలు! మీ యుపమానములు వివేక
రహితుండగు రాఘవునిది యొకజన్మమేనా? లంకలో నొక్క
యేడు దుష్టదానవుల చెంతనున్న దాని దెచ్చుకొనియె నదియే
మి మగతనము. మీరెన్ని జెప్పిన దాని నేలుకొనజాల.

రాఘు——(గూఢచారుండగుభద్రునాలోకించి) విప్రోత్తమా? వార్తలేమి?

భద్రు——మీకు మిక్కుటంబగు దుర్యశము గలిగినది.

రాఘు——అపయశము వచ్చుటకు నేగావించిన అకార్య మేమికలదు?

భద్రు——ఇనకులదీపా! అమిత్రప్రతాపా!

ఉ॥ చాకలివాడొకండు తనచానపయి న్నెపమెంచి పంపగా
లోకులువచ్చి వానిగని లోపము లేని గృహస్థుడుండు నే
పోకిరియైన రావణుని పొంత నొకేడు వసించు మైథిలిన్
జేకొనడే రఘూత్తముడు శీలముతగ్గనే చాలుచాలులే
నీకలికిన్ గ్రహింపుమని నేర్పునజెప్పిన నాత డుగ్రుడై.

తో॥ అవివేకియగుటచేత రాఘువుం-డాలినిజేకొనెగాని
యెవరెన్నివిధంబుల బోధించిన - నేలనెప్పటికిదీని॥

వ. ఈ తెఱంగున బల్కునాడు

రాఘు——అక్కటా! యెట్టిమాట చెవి నిడవలసివచ్చినది. (భరత
లక్ష్మణశత్రుఘ్నులగాంచి) తమ్ములారా!

చ॥ ఇనకులమందుబుట్టి పృథివీశులుమెచ్చగ నెల్లమర్త్యులం
దనయులచాట్పునన్ గడుముదంబున నేలిన యాజిగర్భమం

దునజనియించి దుర్యశముతోడ సహోదరులార! ధాత్రిలో
దినములబుచ్చనెయ్యెడి మదింగల గోడదియేమి జెప్పుదున్.

శత్రు—అన్నయ్యా! అంతవిచారించుటకు మన మొనరించిన తప్పేమి
యున్నది.

రాఘు—పరకాంతారతుండగు రావణుం డొకయేడు లంకలోనుంచిన
సీతను యేలుకొనుచున్నాడని లోకు లనుకొన్నట్లు వింటి.

శత్రు—(కోపముతో) పూరి - చతురశ్రగతి.

ఇపుడే దునిమెద ॥నిపు॥
అపరాధినియనిసీత । నన్నట్టిమూర్ఖునికంఠ ॥మిపు॥
మార్తాండాన్వయదీపా । భూపా! మైథిలిహృదబ్జద్విరేఫా! ॥యిపు॥

తుత్రి—భాషాపతిముఖులడ్డమువచ్చిన । భవత్పదయుగళమాన వదినెపై
దోషారోపణజేసినట్టియా । దుశ్శీలునియుత్తమాంగమసిచే ॥యిపు॥
నీలనీరదశ్యామా! రామా! నిఖలవైరిభీకరసంగ్రామా ॥యి॥

భర—జనకునిగృహమునబెరిగి దశరథ । ఘ్నాజాని పెద్దకోడలై జగం
బుననన్నులమిన్న యనెడిసత్కీ । ర్తినిబొందినట్టి భూపుత్రికనే
జనాధముం డవినీతురాలనుచు । జాటెనో వాడేగి యంబరం
బునదాగిన సాగరమునగ్రుంగిన । ముమ్మూర్తులు వానికడ్డుపడిన ॥ని॥
కరుణాలవాలబాలాజపాల । కరివ్యాదాంబుదఝంఝూవాతూల ॥ని॥

రాఘు—తమ్ములారా! యెందులకీకోపము? పౌరులు పలుతెఱంగు లను
కొనుచున్నారని విన్నప్పటినుండి నాహృదయము మిగుల పరితపించు
చున్నది. కావున సీతను విడిచినచో మనకీర్తికి భంగమురాదని
నాతలంపు. (లక్ష్మణునివంకజూచి)

కాఫి — చతురశ్రగతి.

అనుజ! జానకినిగొనిపోయి । అడవిలోవిడచిరావోయి
మ నయినకులమునకువత్తా! । మగువతెచ్చెనుపెనుమచ్చ ॥అను॥

లక్ష్మ—నను క్షమింపుడాసీత । నయగుణోపేత నామాత
కనుక కారడవిలో తోయ్య । లిని విడజాలనన్నయ్య ॥నను॥

సీ. ప్రల్లదుండైన విరాధుని యమధామమునకంపినార మేవనితకొరకు
యింద్రనందను గూల్చియినజునితోడ మైత్రిని సల్పినార మేవనితకొరకు
కపులను జేర్చి సాగరమున సేతువు బంధించినార మేవనితకొరకు
అఖిలదిక్పాలుర నడచిన దశకంధరునిజంపినార మేవనితకొరకు

గీ॥ ఇట్టికష్టముల్ పడిపడి యింతి నిటకు
దెచ్చి క్రిమ్మఱ వనికి బుత్తేరబూన
గూడునా? సర్వకల్యాణగుణసమేత
క్ష్మాతనూజాత సీత ఆజన్మపూత!

రాఘు——(భరతునివంకజూచి)

పై కీర్తన వర్ణమెట్టు

తమ్ముడా! భరత నాశాసనము । మన్నింప నీకాన
నెమ్మదిలోనగలదేని నీవను సంశయముమాని ॥తమ్ము॥

భర——తగదునన్నిట్టిపనికంప । మగువపై జూపు డనుకంప
జగతిమీరెఱుగనిధర్మ । ము గలదె శ్రీరామవర్మ ॥తగ॥

గీ॥ అవనిజను మిమ్ము సౌమిత్రి నడవికంపి
నట్టి కైకమ్మకడుపున బుట్టినట్టి
పాపచిత్తుండు వీడెపో భరతుడంచు
నిందయొకటిప్పటికె నాదునెత్తిగలదు.

రాఘు——(తనలో) వదినెగారిమీదగల ప్రేమచేత భరతుండు నామాట
నతిక్రమించుచున్నాడు రానిమ్ము శతృఘ్నునడిగి చూచెదను.

(పై కీర్తనలోని వర్ణమెట్టు)

చిన్నినైదోడ నీమాట । చెప్పుము సీత యిచ్చోట
నున్నచో వచ్చునపకీర్తి । యూహింపుమానయపథవర్తి ॥చిన్ని

శతృ——చానపై బిట్టలుకజూప । సబబుగా దర్కకులదీప
కానకు న్గానిపోవనోప । జానకి సద్గుణకలాప! ॥చాన॥

రాఘు—తమ్ములారా! నాయాజ్ఞ నుల్లంఘింతురని స్వప్నమందైన ననుకొనలేదు. హితవులెన్ని జెప్పినను నాచెవి కెక్కవు. హా!

గీ॥ వచ్చు నపకీర్తి జానకి నొదలకున్న
యశముపోయిన వెన్క నీ ప్రాణ మేల
రవికులంబున కపకీర్తి దవులజేయ
నన్ను బుట్టించెగాబోలు నలువ జగతి.

లక్ష్మ—అన్నయ్యా! మీ రిట్లు చింతింపదగదు.

రాఘు—లక్ష్మణా! చింతించుట కే మున్నది! సమయము వచ్చినపుడు రాముం డిట్టివా డని నన్ను గదా అనుకొందురు.

(ఖడ్గము పట్టుకొని)

ఉ॥ చెప్పగరానినింద సరసీరుహలోచన పొందె, నక్కటా!
తప్పిరి నాదుశాసనము దమ్ములు, నీ యపకీర్తితోడ నే
నిప్పుడమి న్వసించి తలయెత్తి చరింపగజాల, నిప్పుడే
దప్పక రాఘవాపశదు ధర్మనివాసము జేర్చు ఖడ్గమా!

భ-ల-శ—అన్నయ్యా! మిమ్ము మీరె శత్రువుగా దలంచితిరాయేమి? మీ కీ వెఱ్ఱితనంబేల! మీ రెఱుంగని ధర్మము గలదె?

రాఘు—తమ్ములారా! మీరు నాసమీపమం దుండుటచే నాచేయి బట్టుకొని నాపూనిక కడ్డు దగిలితిరి (ముందుకు నడచుచు)

బేహాగ్ — త్రిశ్రగతి.

పోయెద బోయెద నిప్పుడె నే ॥పో॥
హాయిగనుండుడు మీరటిచ్చట। నాయిచ్ఛవచ్చినచోటికే ॥పో॥
మాటచెల్లనియింటిలోన। మనుట మంచికాదు
బోటిమీదగల దయ నా। మాటయందు లేదు యి
చ్చోటనున్న యశమునకుం। జేటురాకబోదు నా
మాట లెపుడు మీరు రనుకొంటిరి తమ్ములార! యిట
నుంటనాది నేరము॥

భ-ల-శ—(అడ్డుకొని)

ఖరహరప్రియ—చతురశ్రగతి.

మనవిని వినుమయ్యా అగ్రజా! ॥మన॥
మనమునందు యోచనజేయుము । మామాటవిలువ ముందు
తెలియగల దిక॥ ॥మన॥
మనుజాధముడెవడో బల్కినట్టి । మాటనమ్మి పేరలుకవహించి అనపరాధి
యైనట్టి మావదినె నడవికి బంపుట తగదు తగదు ॥మన॥
సందియంబుమానుము జనకాత్మజ । సాధ్వీలలామలకు తల్లి రా
కేందువదన కంటినీరువిడిచిన । నినకులంబునకు ముప్పువచ్చు మా ॥మన॥

రాఘు—(రోషముతో) భరతలక్ష్మణశత్రుఘ్నులారా!

ఉ॥ రాముడు లేడు సీత కిక రామునకు న్మరి సీతలేదు నే
భూమిని గష్టమో సుఖమొ బొందితి నిప్పటిదాక సీతకు
రామున కీ భవంబున ఋణంబు సమస్తము చెల్లె నేటితో
హైమవతీశుసాక్షిగ మదాజ్ఞను దాటకుడీ క్షమించుడీ.

వ॥ సుమిత్రాత్మజా! లక్ష్మణా! నీవే పోయిరమ్ము.

లక్ష్మ—హా ! పరమేశ్వరా! యీదుష్కార్యము జేయుమని విధాత
నానొసట వ్రాసెనా? తప్పించుకొందమన్నను దిప్పకున్నది.

నీలాంబరి—చతురశ్రగతి.

కటకట దినమణికులపావను డెన్ని । గతుల దెల్పినగాని
వినలే దయ్యయ్యో ॥కట॥
యెటుల జనకజ నే నటవిలోన విడుతు । నీవిధమంతయు
నేమని దెల్పుదు॥ ॥కట॥

సీ॥ అనుకంపబూని మా యమ్మకు గౌసల్య పాయసాన్నంబు నా డీయ
నేల । యిచ్చిన నద్దాని మచ్చిక నాతల్లి గ్రహియింప బిండంబు
గట్టనేల । పిండమేర్పడ నాడుబిడ్డనై పుట్టక నిలను పురుషజన్మ
మెత్తనేల । పురుషుండనైన నిర్జరనాథజిత్తు మార్గణమున జావక
బ్రతుక నేల ।

గీ॥ బ్రితికి నిర్దోషసాధ్వి యగ్రిజునిభార్య
బహుగుణోపేత రత్నగర్భపుత్రిభూత
నబల సుకుమారి గర్భిణి నక్కటకట!
వనములో డించి మరల రా భాలుపడిమె.

రాఘు—తమ్ముడా! లక్ష్మణా! గర్భవతి నేనెపంబున వనమున డించి వత్తునా యని శంకింపవలదు. మేమొకనా డేకాంతంబున నుండ మందాకినీ తీరారణ్యాపుణ్యాశ్రమంబులయందు మునికన్యకలతో నాడుకొన వేడుక జనియించినదనియు, నీ యీప్సితంబు నెఱ వేర్పుడనియు నన్ను గోరినది గావున నీ నెపంబున మీావదినెను భాగీరథీ ప్రాంతారణ్యంబున డించి రమ్ము. లెమ్ము.

లక్ష్మ—అగ్రిజా! చిత్తము. అమ్మా! సీతా! లోకమాతా! మదగ్రి జుని యాజ్ఞ విని గంగానదీతట పుణ్యాశ్రిమములందు ముని కన్యకలతో నాడుకొనుటకయి మిమ్ము విడువ వచ్చితి.

---

# రెండవ భాగము



సీత—లక్ష్మణా! మంచిది. ఈకోరిక దీర్పుండని మీాయన్నగారిని బ్రార్థించియుంటి. (రామునియొద్ద సెలవు గొని రథారోహ ణము సేయుచు ముందుకు జని చని) లక్ష్మణా! చూడుము.

ఉ॥ బాడబు డొక్కడే యెదురువచ్చె ధ్వజాగ్రిమునందు గ్రిద్ద ల
ల్లాడగజొచ్చె మాసెను వియన్మణి భూమిపరాగ మెంతయో
నే డరదంబుపై బడియె నీచవృకంబులు కూయసాగె నీ
జాడలు చూడ నామదికి సంశయమేమొ జనించె లక్ష్మణా!

(ఏమియుం జెప్పజాలక మొగము చిన్నిచేసుకొని ముందుగల నదిని సమీాపించి నావపై పోవుతటి)

సీత—(అనుమానమున సౌమిత్రి నవలోకించి)

చ॥ [illegible]నుగొనినంతమాత్రిమున గష్టములెల్ల నశింపజేయు వా

హాని యిది యీనది స్గని యహీనముదంబున నుండవేమి స్యం
దనమున గూరుచున్నది మొదల్ కుముదాప్తునిగన్న తమ్మి రీ
తిని మఱది! భవన్ముఖము తేటదొఱంగిన హేతువేమొకో?

లక్ష్మ—అమ్మా! అడలకుము. అని (నట్టడవిం బ్రవేశించి రథంబును
డించి కన్నుల నీరు నించి నంత సీత జూచి)

మంజరి—నగలను వెలగలబట్టలగై కొని - నారచేలముల నిచ్చి
పగవహించి కై కమ్మ మువ్వరక్ - వనసీమలకును బుచ్చి
నపుడై న నధికసంతోషమ్మున - నలరితివి కృపాశరధీ
యిపుడు ముఖవికాసమ్ము దొఱంగుట - కేమి హేతువో మరదీ!

ఖరహరప్రియ — త్రిశ్రగతి.

ఏమని విన్నవింతు - నో మాయమ్మ సీతోడనే ॥నే॥
శ్యామలాంగుడౌ రఘు - రామాజ్ఞ దెల్ప నోరాడ ॥దేమ॥
మేమెంతో మందలింప - మామీద దా నాగ్రహించె ॥నేమ॥
గీ॥ కొంతకాలమ్ము రావణు పొంతనున్న
నిన్ను చేపట్టెనని లోకనింద దాను
విని యరణ్యమ్ములో నిన్ను విడిచిపెట్టు
డనుచు సెలవిచ్చి పంపె నో యబల! చింత
పడవల దసురాంతకుండు నీ
కబ్బిన నంత ద్రోయగల డమలస్వాంత ॥యేమ॥

సీత—(మూర్ఛిల్లి పిమ్మట లేచి) లక్ష్మణా!

హిం॥ తోడి — త్రిశ్రగతి.

ఎంతచిత్రమో మరదీ!
సంతసమున నల్లహుతా। శనుడు మీరలందరు విన
నింతి సాధ్వియన నమ్మి న।న్నేలలేదె మీపెద్దన్న ॥యెం॥
జడుడొకండు పలుకగ నది। సైపక నన్నింప దగునె
యడవికి నటులంపిన నిది। యనుచు పల్క రాదె? తన
యడుగుదమ్ముల పూజింపు। నతని దైవముగ నెంచితి ॥నెం॥

పగలు రేలు సిగలోగల । పరిసూనమ్ములు వాడకుం
డగ పదునాల్గేం డ్లడవిని । మగుడ నింటగాచి తుదకు
పగగొని నిండుజూలాలి । నగు న న్నిటు సేయ దగునె ॥యెం॥

వ॥ మి మ్మననవలసిన పనియేమి? నావార్తకు నేనే విచారింపవలసినదే
కాని అపవాదమొందిన చపలాక్షిని భరించుట యుక్తమా?
దుష్టురాలనగు నన్ను వర్జించి మీ ఘనమ్మును గాపాడుకొంటిరి.
లక్ష్మణా! యిది యిట్టిదియని నీవైన జెప్పకపోతివి.

లక్ష్మ—అమ్మా! ఆతప్పు నాయందే కలదు.

సీత—నీతప్పేమి యున్నది? అన్నగారియాజ్ఞ తమ్ముడు నిర్వర్తించుట
విధిగదా? న్యాయమెఱింగిన నీవంటివాడ వుపేక్షింతువా? ఇం
తకు మీయన్నగారు నిగ్రహానుగ్రహసమర్థులుగదా!

లక్ష్మ—మాతా! ఆజన్మపూతా! వేయేల

చ॥ అడవిని డించినాడ నిను నారఘురాముని శాసనమ్ము నే
గడపగ లేక, నాపయిని కాకవహింపకుమమ్మ డెందమం,
దడలకుమమ్మ, రాఘవు పదాంబుజసంస్మరణంబు పూని యె
క్కడ నివసించిన న్సుఖమె గల్గును నిశ్చయమమ్మ మైథిలీ!

వ॥ అమ్మా! సెలవొసంగుము, పోయివచ్చెదను.

సీత—లక్ష్మణా! ఇంక నాకు భగవంతుడే దిక్కు. మరల రాముని
నాకన్నుల గనుగొను భాగ్యము నాకున్నదో లేదో దేవుడెఱుంగు
నట్లుగాకున్న నాశరీరమును విడుచుటకై మిన్నువాకమడుగు
సమీపమందే యున్నది.

లక్ష్మ—(మనంబున నడలి)

ముఖారి — త్ర్యశ్రగతి.

అమ్మా! నామనవిని గై । కొమ్మ ధైర్యమును జే
కొమ్మ రాఘవుని ప్రియ ధ । నమ్మ సుఖమబ్బు ॥నమ్మ॥
నమ్ము మగతికులకు రమా । నాయకుండు దయతో సా
యమ్ము సేయునని కోవిదు । లన్నమాట దబ్బరకా ॥దమ్మ॥

ఇడుమలబ్బి నపుడు స్త్రీలు । జడమున బడి పాణమ్ముల
విడుతురుత్తరుచుగనది యె । న్నడు జేయుట తగదుదగదు జుమ్మి నీ
వెరుగని ధర్మమ్మ కలదె । యీలోకమ్మున నామాటలునమ్ము॥
అరయ గర్భవతివి నీవటు చేసిన నాత్మహత్యా ॥మా॥
దురిత మొకటి భ్రూణహత్యా । దోషమొకటి లభియించును
మాతా! సకలసద్గుణోపేత! నీవుండుము జాగ్రత్తగా॥
ధరణీసంజాత నీ॥ ॥తమ్మ॥

సీత—లక్ష్మణా! నాగతి యేమికానున్నదో? గంపంతబలగమ్ము వి
డిచి దిక్కుమాలినదానివలె నరణ్యంబున దిరుగవలసి వచ్చినది.
కానిమ్ము నాకర్మ మేగతి గలదో యట్లు కాకమానదు.

గీ॥ అనపరాధుల గాపాడు టదియె క్షాత్ర
ధర్మ మందురు పెద్దల ద్దాని కిపుడు
భంగమబ్బె నటంచు నే వగచుచుంటి
ననుము మీయన్నతో సుమిత్రాత్మజాత!

వ॥ మఱియు,

సీ॥ నను పుత్రికాభావమున దయంజూచు నామువ్వురత్తలకు కేల్మోడ్చి
ననుము । వనికి న న్నంపిన తనయు దూరకుమని కోసలాత్మజ కోరి
కొంటిననుము । తనయాజ్ఞ నడవి జేరిన దీనురాలిపై నురుదయ మీ
యన్న నుంపుమనుము । మాతృకవలె జూచు మాండవీ శ్రుతకీర్తి
విభుల వేమారు దీవింతుననుము

గీ॥ తోడికోడండ్రి ననుగు బంధుగుల ప్రేమ
నడిగినానను మో సుమిత్రాత్మజాత!
అడలకుము నన్ను గురించి యా విధాత
మెంచి నానొత్తి వ్రాసినా డిట్టివ్రాత.

వ॥ మరియు పితృవాక్య పరిపాలనాధురంధరుండగు రాఘవున కిట్టు లం
పుట కూడదని నచ్చజెప్పుటకై నాకర్మమే మాయత్తలకు దెలి
యకుండ జేసినదని నే ననుకొన్నట్లు మా యత్తలకు నా మాటలు

గా నివేదించి ఇచ్చోటగల వారి ద్రవ్యమునకు ఛిద్రము గలుగ
కుండ నట్టు లాశీర్వదింపు మనుము.

లక్ష్మ—అమ్మా! పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

సీత—(తనలో) లక్ష్మణుం డరుగుచున్నాడు. హా దైవమా!

హిం- తోడి చతురశ్రగతి.

ఏమిజరుగనై యున్నదో నా కిక। యెరుగరాదు శ్రీరామా! ॥యే॥
స్వామీ! నోనముల వామి। నామీదను రాదేమి ॥యే॥
శరభానేకప శార్దూలంబులు। దిరుగుచున్న విచ్చోట
ధరణిజ కడుదీనురాలనుచు గని। కరము నెరపునో కఠినముజూపునో॥ యే॥
ఏమిసేయుదు నరకాలను బొక్క। లెన్నియోతోచె నకటా
నామేనంతయు జెమటనిండె నిక। నదుపజాల పాలిత బాలాజీ
నామా। సద్గుణధామా! భూపలలామా! చూపుము ప్రేమ ॥యే॥

వ॥ నాకు నేనే ధైర్యమును జెప్పుకొని పోవలయును. జనకరాజు
కూతునై మార్తాండవంశాభిరాముం డగు రామునకు దేవినై
దశరథునకు పెద్దకోడలనై కట్టకడకు దిక్కుమాలిన పక్షివలె
నట్టనడవిలో జరింపవలసివచ్చె నాజీవితేశునకే దయతప్పినప్పుడు
భగవంతునకేల దయవచ్చును? పతి కాదనిన సతికి గతియెక్కడ?

కమాచి — చతురశ్రగతి.

రామా! సద్గుణధామా! దనుజ। విరామా! నాపై రాదా ప్రేమ ॥రా॥
ఆమహానీయుండగు వైశ్వానరు। డాడినమాటలు మఱచితివో యుప
యామసమయమున జరిగినబాస। లన్నియు నేమూలను విడిచితివో
(మి) పామరజనులాడి నట్టిమాటలు। పథ్యమయ్యెనే రాజరాజను
త్రామసూర్యవంశాంబుధి రాకా। సోమా!రూపపరాజితకామ॥రా॥
అపరాధులకు శిక్షవిధించుట। నృపతుల ధర్మంబని యెఱుగవొకో
సుపథవర్తిని నన్నీ ఘోర। విపినమ్మున కేమని పంపివిడిచితివో
(మి) తపనతేజ నన్విడువగ నీ కెం। దమ్మెగతి సమ్మతించె దూరగ
నిపుడేలను నాభాగ్యం బిదియో। లపన నిర్జితాంబుజాతవైరీ ॥రా॥

వ॥ ఇట్లు (వితర్కించుచుండ మునిబాలకుం డాలోకించి చని)

సువ్రి——వాల్మీకిఋషివర్యా! అరణ్యంబున గర్భిణీస్త్రీ 'రఘురామా!' యని యెలుగెత్తి యేడ్చుచున్నది.

(వాల్మీకి వచ్చి సీత నవలోకించి) అమ్మా! మీ రెవ్వరు?

పీల్వా — శతురశ్రగతి.

మునిజనప్రవర । ఏమని విన్నవింతు నో ॥ము॥
ననుజుట్టుకొన్న చిక్కు । లను దేవుండె యెరుగు ॥ము॥
జనకరాజపుత్రికను దశరథ । త్మాజాని పెద్దకోడల శంకర
ధనువెత్తిన రాఘవరాముని కే । ల్దమ్మి బట్టినట్టి సీత నో ॥ము॥
అపరాధినని లోకు । లన్నమాట లాలకించి
కృపమాని నాపతి యీ । విపినమున కంపించె
తపసికులచంద్రా! యొకరిమీద । నెపముంచనేల నుదుటివ్రాతయిది
విపుల యోగదృష్టిచేతజూచిన । విశదంబగు జనకాత్మజస్థితి॥ము॥

వాల్మీ—— మంజరి.

క్షేమంబొదవును జమ్మా యీగతి - ఖేదము నొందకుమమ్మ
రామునిసత్కృపవచ్చువరకు నా - ధామమున నుండుమమ్మ
ననువేఱుగ నీతండ్రిని వేఱుగ - మనమున దలంపకమ్మ
తనయులు నీగర్భమున నిద్దరు - దప్పక బొడముదురమ్మ
విలువిద్యయు నలుప్రామినుకుల వా - రలకు నేర్పెదను నమ్మ
తులలేని యశంబార్జింతువు నీ - కలవడు నతిసౌఖ్యమ్మ॥

కావున నీ యుమ్మలిక మాని నా - కుటజమ్మునకు రమ్మ ముని
సువాసినులచే సపర్యల జేయించెద నమ్మ.

సీత——నే నెచ్చట తలదాచుకుందునా యని నెమకుచుండ నామీదనిర్హేతుకజాయమాన కరుణాకటాక్షంబు బ్రసరింప జేసితిరి. మీ పర్ణశాలకు బోవుదము.

# మూడవ భాగము.

రామ—(ప్రమదావనంబున బ్రవేశించి ముందుకు నడచుచు)

చ. చిటికెనవేళ్లు బట్టుకొని చెప్పగరాని ముదంబుతోడ ము
చ్చటలను జెప్పుకొంచు కడు చల్లనిగాలికి బూలతోటలో
నటనట బుష్పవాసనల నానుచు బండ్లరుచి స్గ్రహింపుచున్
దిటవగు తిన్నెలందు శయనించుచు బల్మరు కేరినవ్వ చా
దట విహరించుచుంటిమిగదా యది యేమరితెయ్యొ జానకీ!

నిద్రలో స్వప్నంబున సీత కానవచ్చిన

తోడి — మిశ్రగతి.

జానకీ ధన్యుడనైతినే ॥జాన॥
ఏనాడు నేజేసిన పుణ్య । మో నేడు మరల నినుజూడనయ్యె ॥జాన॥
విధివశమున నిన్నాళ్లు నిన్ను । విడిచిపెట్టవలసివచ్చెనయ్యో ॥జాన॥

(అంత దిగ్గునలేచి సీత కానరామిని కన్నీరునించి)

హా జానకీ! ఈరాముని విడిచిపోతివా?

మ. నరసంచారములేని కారడవిలో నానామృగశ్రేణిభీ
కరవృత్తిం జరియించి గర్జిలగ వీక న్బ్రాని యె ట్లుంటివో
వరశాల్యాన్నము లేమి నెంతపరితాపం బందుచున్నావో యె
వ్వరియింటం దలదాచుకొంటివోగదా ప్రాణేశ్వరీ! మైథిలీ!

శత్రు—అగ్రజన్మా!

చ. వరుసగ రెండుకట్లులు ప్రవాహమునం జతగూడి కొంత ద
వ్వరిగి తమంత దామె యెడమై చను నిద్ది జగత్స్వభావ మం
చెరిగిన ప్రాజ్ఞులయ్యు నిటు లేడ్వగజెల్లునె మీాకె యీాగతిం
జరిపిన మమ్ముబో ల్డుడుమల సంగతి యేమగునో రఘూత్తమా!

రాము—తమ్ముడా! శత్రుఘ్నా!

తో॥ పాపల గని వంశము తామరతం । పర జేయదలచినాడ
నాపుణ్యపుంజ మీావిధమున । పరిణమించెనో సైదోడ॥
(అశ్రుకణములొలుకుచుండ) హాసీతా! రత్నగర్భప్రభూతా!

తో॥ ఎట్టిచెడువేళ గర్భమ్మును ధరి । యించితివో యలివేణి
పట్టువిడిచి వనిలో నుండవలసి । వచ్చె మార్ధ్వకవాణి॥
[అంత సీత నడవిని డించివచ్చిన సౌమిత్రిం గని]

ఖరహరప్రియ — చతురశ్రగతి.

నాదయిత సీత యేదిరా తమ్ముడా! ॥నా॥
యేదిర తమ్ముడ । తా నేమనియె సైదోడ ॥నా॥
లోకులన్నమాట లాలకించి లోలాక్షి నడవికి బంపించి
శోకాబ్ధిని ముసింగితినిటుపై నే నేకాకిగ నెట్లుజరియింతుదమ్ముడ॥నా॥
ఏలుటకై ప్రాజ్యరాజ్య సంపద । లెన్నిగల్గియున్నగాని ప్రియు
రాలులేని సంసారిజీవన మ । రణ్యమునగాయు వెన్నెలచందమూ ॥నా॥

లక్ష్మ—అన్నయ్యా! ఊరడిల్లు మూరడిల్లుము. మించినదానికి విచారింపనేల? దేవరవారి సెలవుప్రకార మరణ్యంబున వదినెగారిని విడిచివచ్చితిని. చేయికాలినపిమ్మట ఆకుబట్టిన లాభ మేమి?

ఉ॥ ఒక్కడు తిండిలేదనుచు నొక్కడు ద్రవ్యము లేదటంచు నిం
కొక్కడు భార్యలేదనుచు నొక్కడు బిడ్డలు లేరటంచు నీ
ఫక్కి గృహస్థులెల్ల పెనుబాముల నుక్కడు రీభవాబ్ధిలో
జిక్కినవారలందరకు జింతయెగా కొక సౌఖ్యమున్నదే.

రాము—తమ్ముడా! లక్ష్మణా!

గీ॥ లేక లేక గర్భమ్ము నాలేమ దాల్చె
నట్టి మూలాలి నడవికి నంపినాడ
జేతులారంగ జేసిన పాతకంబు
నన్ను విడువదు జన్మజన్మములకైన

లక్ష్మ—అగ్రజాతా! తేజో నిర్జితఖద్యోతా!

కమాచి — చతురశ్రగతి.

కడచిన దానికి వగవగ నేల
వేనుడివినగతిజేసిన యశమున వంగడ మూప్పొంగు దురితమడంగు ॥క॥
అలదశకంతుని దునిమినపిమ్మట । హయమేధ మొకటిగావించుటకై
తలచియుంటి రింతవరకు తత్సవనము । సలుపుట కానరా దిప్పుడైన

సడలని దీక్షచే గ్రతువుసల్పుటకై సమకట్టి ధాత్రిపై
విడిచిన వాజిరత్న మిది పేరులు గల్గిన దీని బట్టుడీ.

వ॥ ఈవిధమున స్వర్ణపటమును జెక్కించి తీసికొనిరమ్ము.

పుర—చిత్తము. (చెక్కించి) తత్పటమును సమర్పింప.

లక్ష్మ—పెద్దన్నయ్యా! గుఱ్ఱము సిద్ధముగా నున్నది.

రాము—అరిజనదర్పఘ్నా! శత్రుఘ్నా! నీవు సవనాశ్వము వెంట నరుగుము. తమ్ముడా! కైకపట్టి! మనబంధువుల నందఱిని దీసికొని రమ్ము. లక్ష్మణా! నీ వేగి జనకరాజుగారితో,

ఫీల్కా—త్రిశ్రగతి.

అనుమా మిథిలేశునితో నీ విట్టు ॥లను॥
తనకూతును వనసీమకు। బనిచినట్టితప్పు క్షమింపు ॥డను॥
అయ్యా పెద్దదిక్కెవ రని। యడుగ పంక్తిరథుండు మా
వియ్యంకుడు గల డని। మీపేరుజెప్పి ప్రాణమువిడచె ॥నను॥
బత్తితోడ నిపు డొకయ। ధ్వరము సేయదలచినాడ
తత్తడిజన్నంబును గని, దగ్గరనుండి చేయించు ॥డను॥

లక్ష్మ-భర-శత్రు—చిత్తము. తమసెలవుప్రకారము గావించెదము.

---

## నాలుగవ భాగము

వ॥ వాల్మీకి యాశ్రమంబున సీతాదేవి కవలంగనిన వారు కుశ లవు లను నామంబున బెరుగుచు జతుర్వేద శస్త్రవిద్యల నామునికుంజరుని యొద్ద నేర్చుకొని తల్లికి ముద్దుల గుడుచుచు దోడి వటువులతో నాడుచు నొకనాడు మునిపుత్రులతో లవుం డేగి యాడుకొనుచు రాఘవునిచే విడువబడిన సవనతురంగమును జూచి,

లవు—విప్రబాలకులార!

బేహాగ్—త్రిశ్రగతి.

చూడుడీ యీగుఱ్ఱముల్ బాలులారా ॥చూడు॥
యేడనుండియో వచ్చుచున్నది దాని। జాడ జూడ వేడుకబుట్టు
చున్నది ॥చూ॥

ఆరయ నొసటఁ బటముగట్టియున్నది కనుదా। మరలకు మిరుమిట్లు
గొలుపుచున్నది సరగున బట్టుండి యాతరువున గట్టుండి ॥చూ॥

నిమి—లవకుమారా! నెచ్చెలులారా!

చ. సవనము సేయగా దలచి సైంధవఘాలమునందు భారణీ
ధవు లెవరో బటం బొకటిదట్టముగా గదియించి పంపినా
రు నటువులార! దీనిని నిరోధముజేసితిమేని జికు—లం
దవులకమాన; మిప్పు డల తత్తడిజోలికి పోవ నేటికిన్.

లవు—నెచ్చెలులారా! విప్రబాలకు లగుట వెనుక దీయుచున్నారు. క్షత్రియాన్వయ సంజాతులకు భయ మెందుకు? దానినొసట గల పటంబున జగదేకవీరుండు విడిచిన క్రతుతురంగమనియు, వీరు లున్నచో బట్టుఁడనియు నున్నదిగదా! నే శూరుండ గానా? నేనే గట్టెదను (అని చెట్టునకు గుఱ్ఱమును గట్టునంత)

శత్రు—బాలకా! ఈసవనాశ్వము నేల గట్టితివి?

లవు—దాని నుదుటగల స్వర్ణపటమున వీరు లున్న-చో బట్టు డని వ్రాసియుండుటచేత.

శత్రు—నీవు శూరుఁడవేనా?

లవు—అవును. నే శూరుండ నని నా నమ్మకము.

శత్రు— కేదారగౌళ — చతురశ్రగతి.

బాలుడ వని కనికరించుచున్నాడ। బాబాను విడువుమా వత్సా॥బా॥
ఆలమెక్కడ నీవెక్కడ స। య్యాట లనుకుంటివా వత్సా ॥బా॥
తాలిమి కలుగకమానదు నీ మోము। దమ్మి జూచినంత నీ దు
రాలాపము విన్నవారికి గోపం। బడరుట కొకవింత
భూలోకంబున మా కెదురు రా। జాల రెవ్వరైనగాని వినుమా
నీలకంఠునైన లెక్క సేయము। నీ వెంతవత్సా! మానుమురచ్చా॥బా॥

లవు—చాలుచాలు. వట్టిప్రలాపము లావల గట్టిపెట్టుము.

ఆభేరి — చతురశ్రగతి.

మగటిమి గలదేని। మము గెల్చుకొనుమ ॥మగ॥
తగుదుననిగదా। కత్తడి వెంట వచ్చినాడవు ॥మ॥

ఈవారువమ్ము నే భూపాలకు । డీమార్గమున బంపెనో వాని
లావు దరువాతగని పెట్టెద నిటు । రమ్ము చేతగాకున్న బొమ్ము ॥వు॥
తగవులేల నీకు నాకు గ్రతుదీ । ఖగలరాజు బతిమాలి దీనినొస
టగలస్వర్ణపటముడించియీఘో।టకమునుగొనిపోవచ్చినవిడచెద॥

శత్రు—నీ వయసునకు దగిన మాటలాడిన పెద్దలు హర్షింతురు.

లవు—అవును. శక్తికిదగినపని జేసిన నట్టులే.

శత్రు—మేము శక్తిహీనుల మని కాంబోలు నీ యభిప్రాయము.

లవు—రణమునకు రమ్మనిన త్వరపడకుండుటయె సాక్షి.

శత్రు—అయినచో నాశక్తి చూడవలె నని యున్నదా ?

లవు—మాటల కాలయాపనమే గాని క్రియ గానరాదు.

(ఇర్వురు మిగుల బోరాడినంత లవుఁడు మూర్ఛిల్లె బిమ్మట)

నిమి—అమ్మా! జానకీ! క్రతుతురంగము వెంట నొక రాజపుంగవుం డును కొందరుయోధులు నరుదేర మే మెంతజెప్పిన వినక లవ కుమారుం డాఘోటకమును బట్టి యొక వ్రానికింగట్టగా వారు దానిని విడువు మని కోరిరి. విడువనని వారి నెదిరించి రణమున మడిసినంతవారు లవునిరథమున నిడి తీసికొనిబోవనై యున్నారు.

సీత—(కన్నీరు నించి) హిం॥ తోడి—చతురశ్రగతి.

అకటా తనయా! నను బాసినాడవా
ఇక నేమిసేయుదాన । నెవరుదిక్కు గుణనిధాన ॥అక॥
నరనాయకు లద్భుతమొందగ బిన్ననాడె శివకార్ముకమెత్తె నెవం
డురుబలుడగు వాలిపంచప్రాణము । లూడబెరికె నొకకోలనెవడు సా
గరమున జిత్రమగు నానకట్టం । గట్టెనెవం డట్టిరాఘువునకుం
జిరుతవయ్యు నొకపగవానిచేత । జిక్కితివా నను గన్నతండ్రి॥ అక॥
వేయేల భోగభాగ్యములు లేక । పోయినప్పటికి ననుంగుపుత్రులు
నాయెదుటను సంచరించుచుండగ । నా కదే లక్షలంచు నానంద
తోయధిలో మునుగుచుంటినకటా । యీయెడకరుణవహింప త్రిజగ
న్నాయకుడు పూర్తిజేసెనా? లవా! । హాయనశతమింతలోనెసీ॥ కక॥

వ. హా! తండ్రీ! ముద్దులయ్యా! పుత్రశోకము నే నెట్లు దరియింతు?
కుశుం డింకను రాడయ్యె. వచ్చినచో నీవార్తవిని యెంతచింతించునో?
సీ॥ అక్కటా నేడు నిన్నలయింప బగవానిచేతులెట్లాడెనో చిన్నికొడుక
ఎచ్చోటికిని దమ్ముడేగినాడని కుశుం డడిగినట్లయిన నేమందుకొడుక
నేబడుచున్నట్టి నెవ్వలుగనలేక పోయితివా నేడు ముద్దుకొడుక
అనదనౌనన్ను నీయన్న నెవ్వారికని నప్పగించితివి నాయనుగుకొడుక
గీ॥ సెయురమ్మున పరిపంథిసాయకమ్ము
తాకినప్పుడు న న్నెంత తలచితొక్కొ
ప్రియసహోదరు కుశు నెంత పిలచితొక్కొ
జేరరమ్మని గురు నెంత జీరితొక్కొ॥
తో॥ కారడవుల గాలముగడపుటకై - కాంతు డంప నరుదెంచి
మీరే నిఖిలం బని తిరుగుచుంటి - మీపై బ్రాణములుంచి
దేనిజూచుకొని యిక నే బ్రతుకుదు - దిక్కెవ్వరు సుకుమార!
ఏ నీమొగమును చూడకున్నచో - నెట్లుందు లవకుమార॥
కుశు—ఏమి యీధ్వని!

కాఫీ—చతురశ్రగతి.

ఏమొకోనాతల్లిమెలుగెత్తి। యెంతో యేడ్చుచున్నదికటకట ॥యే॥
నామదిసందియమగుచున్నది।నాతమ్ముడచట లేనట్టుతోచుచున్నది ॥యే॥
పలువురచ్చోటనిలిచియున్నారు। పలువిధములమాటలాడుచున్నారు
తలచిచూడ నాతల్లికి గట్టిదుఃఖములుగలిగినట్టుల దోచుచున్న దది ॥యే॥
వ. అమ్మా! ఇట్లు చింతింప గారణం బేమి?
సీత— ఫీల్హా—చతురశ్రగతి.

తనయా! ధృతవినయా నా ॥తన॥
యేమని దెల్పుదు నయనజితకుశేశయ ॥తన॥
అటవీసీమలలో మిమ్మతి ప్రేమను బెంచితిని న
క్కటికమూని పగవారు నాకిడిన। కడుపుశోకమేవిధమున దరింతు॥త॥
సవనాశ్వముబట్టి। లవు డొక చెట్టునకుంగట్టి
బవరంబున నీతమ్ముని జయించి।పరిపంథులతనిదోడ్కొనిచనిరట ॥త॥

కుశ—(క్రోధముతో) ఓరి! పరిపంథీ!

చ॥ దురమున మత్సహోదరుని దోర్బలమెల్ల నడంచి యింటికిం
బరువిడినట్టు వింటి కులపాంసన! వానికి నగ్రజుండ న
న్నెరుగవొ యీకుశుండిక జయింపకమానడు నిన్ను శ్రీరమా
వర హిమశైలజారమణ వాక్పతు లడ్డమువచ్చి నిల్చినన్.

(శోకించుచున్న తల్లిని గాంచి)

ఫీల్వా — చతురశ్రగతి.

అమ్మా! కనుమమ్మా! శో । కమ్ముమాని వినవమ్మ
నెమ్మదిలో ధైర్యమ్మానిన సౌ । ఖ్యమొదవును సుమ్మాలెమ్మా॥అ॥
అమ్మా! త్రాటినిగని సర్పమ్మని । యడలు విప్రబాలకులెల్ల
తమ్ము డసువువిడచె నన్నమాటల । నమ్మకూడదంతయు కల్ల
సొమ్మసిలిన వానిని బగవారు ర । థమ్మున నిడి రమ్మకచెల్ల నిము
సమ్ములో లవుని నిల్పెద నీసము । ఖమ్మున విను నీ పదపల్ల
వమ్ములాని సమరమ్ములోన విజ । యమ్మగునట్టుల దీవించి పంపు॥మ॥

సీత—గీ॥ సరసు డగు మీగురుడు సత్యసంధుడేని
నేను సాధ్వినై బరగుదునేని రిపుల
దురమున జయించి నీసహోదరునితోడ
గంటబడుదువుగాక నాకన్నతండ్రి!

కుశు—అమ్మా! పతివ్రతాలలామవైన నీయాశీర్వాదం బుండ నాకేమి కొరంత? సెలవుగైకొనెద. వందనము.

(అంత కుశుం డేగి శత్రుఘ్నుని మూర్ఛిల్లజేసి లవుని లేవనెత్తి)

లవ—స్వామీ! దశరథరాజనందనా! నే నమరకుండను సేవకుండను. క్రతుతురంగము నొక విప్రబాలకుండు నిరోధింప శత్రుఘ్నుం డతని మూర్ఛిల్లజేసి రథమున నిడుకొని వచ్చుచుండ వాని అగ్రజుం డరుదెంచి బ్రహ్మాండము బ్రద్దలగునట్లు సింహనాదం బొనర్చి శత్రుఘ్నుని డాసి ఘోరరణం బొనర్చుచు గడపట మాతాత వీరసువగునేనిదీనిచే బగతుండు నేలనొరుగుగాత యని ఒకశరము బ్రయోగింపమీకనిష్టసోదరుండునేలనొరిగిచేష్టావిహీనుండయ్యె.

రాము—హాతమ్ముడా! జంఝూటి – త్ర్యశ్రగతి.

ఎంతమోసమయ్యెనయ్యో నాతమ్ముడా ॥యెంత॥
అంతకుండయ్యెనే నీపాలిట నల విప్రార్భకు ॥డెంత॥
అల కైకకు గౌసల్యకు నర్భకు డొకడొకడే యని
దలచి లక్ష్మణుడు సుమిత్రికు జాలునటంచు భూ
స్థలిపై నొరగితివా ఆ। ధార మెవరు శత్రుకీర్తికి ॥నెంత॥

భర—అగ్రజా! తమ్ముడు మూర్ఛిల్లియుండవచ్చు. నేనేగి యావృత్తాంతము గనిపెట్టి వచ్చెదను. (ప్రవేశించి కుశు నాలోకించి)

చ. కలనున నిన్ను నొంచు టొకకార్యముగా దిది నిన్నుబోలు పా
పలు పరుషంబులాడిన నవజ్ఞయొనర్చిన నామనంబులో
గలుగదు కోపమించుకయు గావున నావచనంబులెల్ల నీ
నుల నిడి డించి తత్తడి ననూనసుఖమ్మున బొమ్ము బాలకా!

కుశు— పూరి – చతురశ్రగతి.

ఔర మంచి బంటవైనచో। నాలమునకు రమ్ము లెమ్ము
పౌరుషంబునీకుంగలదేని స।వనహాయమునువిడిపించికొనిపొమ్ము॥ఔ॥
భీతహరిణమ్ము పోలక నిటునటు। బెదరి బెదరి చూచుచున్నావు నీ
రీతిజూడ బవరముచేసినట్టు। లే గానవచ్చుచున్నది యా ॥రా॥
గోటనిట్టెమీటినట్టు లెంతో। గొప్ప లిపుడు చెప్పుచున్నావు నీ
మాటలకుంగ్రియకు చాలదూరము। మరలిపొమ్ము చేతగాకున్నచో॥

భర—బాలకా! నీమాటలు చాలచిత్రముగా నున్నవి.

ధన్యాసి – చతురశ్రగతి.

ఇదోవచ్చె బాలకా! కాచికొనుము కూలక ॥యి॥
మదీయ సాయకమ్మునీతల దునుమకమానదిటుల మిట్టిపడబోకు॥
గోచియైన బెట్ట నేరనట్టి। కుఱ్ఱవు నీ కింత గర్వమేల
నాచేతిలోన మరణంబునీకు। నలువవ్రాసిపెట్టె ఫాలతలమున॥ని॥

కుశు—ప్రయోగింపరోరి లిప్తలోన దునిమెద ॥బ్రయో॥
భయానకరసము నేడు భవన్ముఖ। పద్మంబునగానవచ్చుచున్నది

ఏనుక ట్రువాడనై ననేమి । యేనుగెంత సింగమెంత యింతటి
దే నీవివేకము చాల్ చాల్ నీ। తెలివితేట కెవరుసంతసింతురు॥ప॥
భర.—పిల్లవాడవనుచు దయనుబూని నా । యుల్లంబున శాంతించినప్పటికి
బ్రల్లదంబులధికమయ్యెనికనీ।తుత్రుళ్లింతమాచ్చమా పెడిభల్లం॥బి॥
కుశు.—నువ్వియనకరోకలిపోటనునుడి । యెవ్వరెరుగనిది చాలుచాలు నీ
చివ్వరంగు తేటతెల్లమయ్యె।నెవ్వారినైన తోడు దెచ్చుకొని॥ప॥
(ఇట్లనుచు వారుణాస్త్రంబు బ్రయోగింప భరతుండు నేల
నొరగె నంత కొందరేగి రాముని దర్శించి)

జంఝూటి - త్ర్యశ్రగతి

అయ్యా మాతరముగా ॥దయ్యా॥
చయ్యనవిచ్చేయుం డా । ధాత్రినితో గయ్యమాడు
భూపతు లెందరెందరో । బోరాడగ జూచినార
మీపిన్నవాండ్రశక్తి । యిట్టిదియనుచుం జెప్పట ॥కయ్యా॥
ఒకసాయకమున నేల । నొరగె మాండవీప్రియుండు
తక్కినట్టి సైన్యంబం । తయు న్పటాపంచలయ్యె ॥నయ్యా॥
రాము.—(కన్నీరునించి) హాతమ్ముడా! కైకేయీగర్భశుక్తిముక్తాఫలా!
మ. వనవాసం బొనరించుచున్నతఱి సద్భావంబునం బాదుకల్
గొని సింహాసనమందు బెట్టి సుజనుల్గొండాడున ట్లాదరం
బున సౌఖ్యోన్నతినొంద మర్త్యవితతిం బోషించి సత్కీర్తిబొం
దినప్రాజ్ఞుండవు నీవు మాండవి కికన్ దిక్కెవ్వరా తమ్ముడా!
ఉ. ఏటికిబూనితి న్నిరతి నీక్రతుదీక్ష గనిష్టసోదరుం
డేటికి వాజివెంట జనె నేటికి గుఱ్ఱము నాపె బాలకుం
డేటికి కైకముద్దుకొడు కేగెను తమ్ముని లేవనెత్త దా
నేటికి నేలపై నొరగె నీవిధమంతయు నెంచిచూడ నా
బోటి నరణ్యసీమలకు బోవగజేసిన దోస మేమొకో.
లక్ష్మ.—అన్నయ్యా! నే నటుల యూహించినాడను.
రాము.—లక్ష్మణా! మించినదానికి జింతింపనేల? ముందుకార్యసాధన
మాలోచించవలె. పోదమురమ్ము.

లక్ష్మ—చిత్తము. (అని హనుమంతుడు వెంటనంటి రాగ)

రామ—సోదరా! లక్ష్మణా! అదిగో మన క్రతుతురంగము. దాని చెంగట నిద్దరు బాలకులు గలరు. నే నీచెట్టునీడ గొంతసేపు విశ్రమించెద. నీవు ముందుగా నేగి యశ్వంబును విడువు డని మంచి మాటల బోధింపుము. నీపల్కులు వారలకు రుచింపనిచో రణమునకు బ్రియత్నింపుము. నే నింతలో వచ్చెదను.

లక్ష్మ—చిత్తము. తమ సెలవు ప్రకారము (అని ముందుకు జనియె)

లవు—అన్నయ్యా! కుశకుమారా!

మ. తనసైదోడుల గెల్చినార మని తా దండెత్తి వచ్చెసె న్నా
తని దండించుట నీవో నేనో మదిలో దర్కించి వే జెప్పుమా

కుశు—కనుమా యిప్పుడెపోయి నేను పృథుసంగ్రామంబు గావించి యాతని యాద్ధత్య మడంగజేసెదను సుత్రామాదు లౌరాయనన్.

లక్ష్మ—బాలకులారా! చిన్నతనపు చేష్టలు మాని మా క్రతుతురంగమును విడువు డట్లు గావింపనిచో మీకు చిక్కు లబ్బక మానవు.

లవు—ఓహో! యీ యాలాపము లావల గట్టిపెట్టుము.

తో॥ నొచ్చిన తమ్ముల చందం బెరిగియు । వచ్చితివా రణమునకున్
జిచ్చునుడాసిన మిడుత చంద మగు । జెచ్చెరబో నెలవునకున్.

లక్ష్మ—మూర్ఖా! వాగకుము, వాగకుము.

వాగకు నోటికి వచ్చిన యట్టుల । బ్రహ్మదులైన విట్టు
వీగబోరు నాముందర చిటికెన । వ్రేలంతలేవు కట్టు.

లవు—కదనమునకు లేలే వదరనేల । కనుపరచెద నాశక్తిన్
మదనవైరి చెప్పిన నే విడువను । మాను మఖహయాసక్తిన్
బాలుడనని తలచితివేమో నీ । పాలిట గాలుడజుమ్మా
ఆలము సేయుట చేతగానిచో । నొదలనువంచుకొమ్మా పొమ్మా.

కమాచి – త్ర్యశ్రగతి

లక్ష్మ—చాలు ననికి డాయుమ వాచాట నోరు మూయుము
బాలుడవని దలచి బోధ । పరచిన విసవైతివి యిక ॥జాలు॥

మాటలయిన స్పష్టమ్ముగ । నోట ననని వారితో బో
రాట మేల ననుచు గనిక।రమున జెవిని గంటగట్టి
చేటువచ్చు ననుచు నెంత । జెప్పిన నది నీ చెవిని
నాటదయ్యె నీకు స్మర।ణము విధించె విధాత చాల్ ॥చా॥

భూపాళరాగము - చతురశ్రగతి.

లవు—చాలు పోపో క్షత్రియాధమ చాల్ ॥చాలు॥
తూలనాడనేలా! నీలా వెరుంగుదు ॥చాలు॥
అరసిచూడ నే నీ చిటికెన వ్రే।లంత లేను నిజము నిజము భూ
ధరమునకు బిడుగునకుగల తార।తమ్య మెరిగి మసలుకొనుము లేదా
దుఃరము సేయుటకు నూహయున్న నాయె।దుట నిలచి కాచికొనుము
ధరపై మూర్ఛిల్లిన నీసహోదరుల । దరికి నంపుదు దక్షిణము
పురుషజన్మమెత్తినప్పుడే । పిరికితనము వెంటదెచ్చుకొంటివి
పరువునిలుచుగాన మరలిపొమ్ము।బవరంబెక్కడ నీతలయెక్కడ॥చా॥
లవు—(ఇంతలో రాఘువుం డరుదేర) అన్నయ్యా! కుశకుమారా!

ఝుంఝూటి - చతురశ్రగతి.

చూడు మెవ్వడో వచ్చుచున్నాడు చూడు ॥చూడు॥
వాడు మనచే నిదివరకు । గీడునొందినవాని సై
దోడువలె నగపడుచున్నాడు నేను ॥చూడు॥
మన శరీరకాంతికి నీతండు స।మానమైనవాడు
అనిలో మనతో దులదూగునట్టు । లగపడుచున్నాడు చూడు ॥చూ॥
తమ్ముడా! నేడు మనకుగలనున ద।నివి తీరగలదు
ఇమ్ముగ నీతని జయింపకుండ । నింటికి బోవలదు చూడు ॥చూ॥
రాము—(సమీపించి) బాలకులారా!
ఉ. ఎవ్వరుమీరు వంశమది యెయ్యది బందుగులేడ కన్నవా
రెవ్వరు పేరులెవ్వి వసియించెడి పట్టణమెద్ది యే గురుం
డివ్విలువిద్య నేర్పె వని నీగతి దిమ్మరనేల మీ గురుల్
దవ్వుల కెట్టు లంపిరి యథార్థము నర్భకులార! తెల్పుడీ॥
లవు—అన్నయ్యా! కుశకుమారా!

చ. అల పగవానిగొట్టుమని యాజ్ఞయొసంగితి వింక నొక్కడుం
గలిగిన భాగముల్ సమముగా సరిపోవునటంచు నా మదిం
దలచుచునుండగా నిపు డితం డరుదెంచి వృథాపరిసంగముల్
సలుపుచునున్నవా డితనిలావు గనుంగొనుమా మదగ్రిజా!

కుశు—తమ్ముడా! లవకుమార! నేట్టులే తలచితిని.

రాము—బాలకులారా! యేల తొందరపడియెదరు? ముక్కుపచ్చలారని కుఱ్ఱలయ్యు దారతమ్య మాలోచింపక నిట్లాడు టుచితము గాదు.

లక్ష్మ—అన్నయ్యా! రామభద్రా! నాచేతనైనంతవరకు మంచిమాటల నెంతజెప్పిన నీబాలకులకు రుచింపక నోటికివచ్చినట్లు ప్రేలుచున్నా రింక అక్కటికమూని పయికార్యము నాలోచింపుడు.

రాము—సౌమిత్రీ! తొందర పడు టుచితముగాదు. చతురోపాయము లలో మొదటి మూడింటి నుపయోగించి వశులుగాకున్న నాల్గవ దాని నుపయోగింతము.

రాము—మునికుమారులారా! మిమ్ములజూచిన నెంతయో ముద్దు వచ్చుచున్నది. ఇదివరకు నాతమ్ముల బాధించినవారయి నప్పటికి మీతో వైరము పెట్టుకొనుటకు నామన సెంతయు నొప్పకున్నయది. మీజన్మస్థితుల నెఱింగింపుచు మాతురంగంబును విడువుడు.

కుశు— జంఝూటి—రూపకము.

తెలిసెలే నీమాటల | తెఱగు నేలరేడా! ॥తెలి॥
కలనుసేయ నూహయున్న | కదలిరమ్ము లేదా పొమ్ము ॥తెలి॥
మాయమాటలాడి మమ్ము | మచ్చమాప నెంచితివా
మాయెడ నీమాట లణు | మాత్రమైన బనికిరావు
మాయావీ! నీ కెందుకు | మాదగు జన్మస్థితులు
వేయిగతుల బ్రార్థించిన | విడువము నీసవనాశ్వము ॥తె॥

రాము—తమ్ముడా! లక్ష్మణా! యీ బాలకులు విప్రకుమారులట్ల గను పట్టినను వీరిధైర్యం బరయ క్షత్రియబాలకుని తోచుచున్నది.

లక్ష్మ—అన్నయ్యా! నా కట్టిసందేహామే గలిగియున్నది. ఎవ్వరైననేమి మన తురంగమును దీసికొనిపోవ టుచితంబు (అని).

డింభకులారా! పలుమారు దేవతలబాధించిన రావణాసురుని గీటడంచిన యీమహానుభావునకు మిమ్ముగెల్చుటొక లెక్కగాదు. వనాంతరమున గల విప్రబాలుకుల గెఱపుట ధర్మంబుగాదని తలచి మిమ్ము సామంబున నడుగుటచే చేతగానివానిగాదలంచితిరి కాబోలు!

లవు—కుశకుమారా! ఈతడు రామాయణకథానాయకుండగు రాముండు కాబోలు! నీతనిప్రభావము మనకు క్రొత్తది కాదు.

కుశు—తమ్ముడా! లవకుమారా! వీనిది కోతులదండట. అగస్త్యుండు పుడిసిటగ్రోలి విడిచిన యుదకంబున రాతికట్ట గట్టెనట!

లక్ష్మ—అగ్రజన్మా! రామా! వీరిమాటలు మితిమీఱుచున్నవి. వీరితో పనియేల? గుఱ్ఱమును దీసికొనిపోవుదము.

కుశు—ఆగు మాగుము. త్రిమూర్తు లేకమైనను జగదేకవీరమాత సూనులమగు మాచేజిక్కిన సైంధవమును విడిపించుకొనిపోలేరు. ఎవడో వీరమాతసూనుండట క్రతుదీక్షవహించి హయఫాలంబున స్వర్ణపట మొకటికట్టి పంపినాడట. లోకంబున మాకన్న వీరమాత సూను లెవ్వరు? వేయేల? క్రతువు నెఱవేర్చుకొన నూహయున్నచో తత్పటమును మా కొసంగిన తురంగమును విడిచిపెట్టెదము.

రాము—(కోపముతో) కుఱ్ఱలారా! ప్రేలకుడు, ప్రేలకుడు!!

క. కులమందు బాపనయ్యలు
   తలపా సూపమున వయసు దలపగ ముకుప
   చ్చలు వోనివారు మీకుం
   గలనికి నెంతయును దప్ప కందువులారా!

కుశు— అవును, మాపప్పు మి మ్మట్లడుగుచున్నది.

పూరి—చతురశ్రగతి.

ఇతడేన ఆహా
అతిప్రేమజూడవచ్చినట్టి! యతివముక్కుచెవులనుగోయించినవా॥డిత॥
శబరియిచ్చినయెంగిలిపండ్లను। కబలించికులముజెరుచుకొన్నవా॥డిత॥
కోలలచేగట్టనేర్పుచాలక। కొండలచే సేతువుగట్టినవా ॥డిత॥
చిన్నకోతిపిల్లను జంపుటకై। చెట్టుచాటున మాటుగట్టినవా ॥డిత॥

హను—(కోపముతో) అర్భకులారా! కోతిపిల్ల యనుచున్నారు.
కోతు లంతతక్కువగా దోచుచున్నదా యేమి?

కుశు—నీ వెవ్వం డవు?

హను—నే వాయుపుత్రుండను. పేరు హనుమంతుడు.

కుశు—ఓహో! నీవా? నీ తెలివి, నీ ప్రభుని తెలివి దలంప మా కాశ్చర్య మగుచున్నది. ఏలయన, నుదయాద్రిమీఁద నొక పాదము అస్తగిరిమీఁద నొకపాదము నుంచి సూర్యుని చెంత విద్య నేర్చినట్లు కొందరనగా వింటిని. అదియే నిజమైనచో లంకకు బోవునప్పు డొకపాద మీవల, నొకపాదమావల నుంచి సైన్యమును సముద్రము దాటించుటకు బదులు సేతువుగట్ట బ్రయత్నించితిరి. మాతో గయ్యము బెట్టుకొనుట మాని యున్న గౌరవమును దక్కించుకొనుడు.

రాము—ఆంజనేయా! నీ వటుండుము. తాడనంబుచేతగాని బుద్ధిరాదు.

కుశు—తమ్ముఁడా! లవకుమారా! చూచెదవేమి నీవొకని చక్కబెట్టుము. రెండవవానితో నే బోరాడెదను.

వాల్మీ—(అంతలో వచ్చి) బాలకులారా!

కాఫీ — త్రిశ్రగతి.

తగ వెందుకు మీకు ॥తగ॥
సగము కనులు దెరచినట్టి ఛాత్రులారా! ॥తగ॥
మీపోలిక నున్నవాడె । మీజనకుం డాతని స
మీపంబునగలవాడె । మీపినతండ్రి ॥తగ॥

కు-ల—రామలక్ష్మణులకు బ్రణమిల్లి.

నాదనామక్రియ — చతురశ్రగతి.

అపరాధులమైతి మపరాధులమైతి । మర్కవంశప్రదీపా ! ॥అ॥
కృపజూడు మము నేడు । కినుకవీడు, మమ్ము గాపాడు ॥మ॥
వారువమును పిన్నవార మగుట బట్టి । నార మజ్ఞానమున
మీరని తెలియక పోరుటకై తయ్యారయితిమి మోదమున ॥న॥

శ్రీరాముడు మాజనకునిపే రని । సీత జెప్పినదిగాని
ఆ రావణుని జంపినట్టివా డని । యనలే దోభూజాని ॥న॥
ధన్యులమైతిమి నేడు భవదీయ । దర్శన మబ్బుటచేత
నన్యులము గాము సత్కృపతోడ మ ।మ్మాదరింపు నరనేత॥అప॥
(అంత రామలక్ష్మణ భరతాదు లాబాలకుల ముద్దుపెట్టుకొని వాల్మీకి ఋషి సమేతులయి యాశ్రమమున కరిగిరంత రాముండు కంటనీరు విడిచెడి సీత నవలోకించి)

ఫీల్వా - చతురశ్రగతి.

సీతా! సుగుణోపేతా। ధరణిజాతా ఆజన్మపూత ॥సీత॥
నాతోడుసుమా నాప్రాణ । నాయికా! కంటనీరు బెట్టకుము ॥సీ॥
అంతవాని యింటిలోన బెరిగియు । యంతవాని కోడలవైనా
కాంతవయ్యు నీస్థితిలోనుండ । గా నిన్ను జూడ వలసివచ్చెనా ॥సీ॥
ఆలోచింపక పామరోక్తు । లాలకించి యడవికి ని న్నంపితి
నాలోపం బిది క్షమియింపుము నీ।తాలిమిచే మరలగలిసికొంటిమి॥సీ॥

సీత— కుంతలవరాళి – చతురశ్రగతి.

మిము నవలసిన । పనియేమి రామా ॥మి॥
కమలభవుడు నన్ని । కరణి ననుభవిం
పుమని నాఫాలభాగ । మున వ్రాసినదానికి ॥మి॥
వామలూరుతనయుం డధికంబగు।ప్రేమతోడ మము గాపాడుటచే
స్వామీ! క్రిమ్మర మిము జూడగలిగె।చాలధన్యురాలనయితి నేడు॥
క్షమింపుడు పసినిసువులు తెలియక । గావించిన తప్పులున్న-చోమీ
కొమరులుగాని పరులుగారుకదా?ది।నమణివంశపావనా।శ్రితవనా॥మి॥

వాల్మీ—రామా! రఘుకులసుత్రామా! గురునిశాసనంబు నెరవేర్ప కొడుకుల ముద్దు దీర్ప మాకు ముదముగూర్ప నగ్నిసాక్షిగ బెండ్లి యాడిన సీతను గ్రహింపుము.

రాము—మునికులతిలకా! మీ యాజ్ఞ మీరువాడను గాను.

మంగళంమహా మంగళంమహా. సమాప్తము.

---

# ఆంధ్ర నాటకములు.

| | | | |
|---|---|---|---|
| మహానంద ద్రో. సీ. | 0-12 | బొబ్బిలియుద్ధము శ్రీ. కృ. | 1- 0 |
| శ్రీకృష్ణప్రతిజ్ఞ సు. క. | 0-12 | కుశలవ జ. ల. | 0-12 |
| పద్మవ్యూహము మ. న. | 1- 0 | విచిత్రచిత్రమాల అ. సో. | 0-12 |
| ఉషాపరిణయము డిటో | 0-12 | సత్యహరిశ్చంద్ర సో. రా. | 1- 0 |
| రామదాసు గా. సూ. | 0-12 | ఆలీబాబా 40 దొంగలు | 0-12 |
| జయంతజయపాలము గ. కా. | 0- 8 | ఏకచ్ ప్యాలా సాంగ్సు ప్ర. స. | 0-12 |
| పాండవాజ్ఞాతవాసము చె. వేం. | 0- 8 | రామదాసు రా. నా. | 1- 0 |
| కనకతార ము. శం. | 0-12 | సంపూర్ణరామాయణము అ సో. | 1- 0 |
| సతీఅనసూయ అ. సో. | 0-12 | భక్తప్రహ్లాద కొ. గో. | 0-12 |
| తెనాలిరామకృష్ణ చి. సో. | 0-8 | | |

# డిటెక్టివ్ నవలలు

| | | | |
|---|---|---|---|
| బంగారు బరిణె పా 1 | 1- 0 | చోరాగ్రేసర చక్రవర్తి | 0-12 |
| డిటో రెండవభాగము | 1- 0 | గజదొంగ | 0-12 |
| సుడిగాలి పా 1 | 1- 0 | రూపసుందరి | 0-12 |
| సుడిగాలి పా 2 | 1- 0 | సరళ | 0-12 |
| రక్తజ్వాల పా 1 | 0-12 | విషజ్వాల | 0-12 |
| రక్తజ్వాల పా 2 | 0-12 | ఘోరకలి | 0-12 |
| మండ్రగబ్బ పా 1 | 0-12 | శిశుహత్య పా 1 | 1- 0 |
| మండ్రగబ్బ పా 2 | 0-12 | శిశుహత్య పా 2 | 1- 0 |
| యమదూత | 1- 0 | శిశుహత్య పా 3 | 1- 0 |
| పేటికాంతర శవము పా 1 | 0-12 | హత్యావినోది | 0-12 |
| డిటో పా 2 | 0-12 | ఇందిర | 1- 0 |
| భయంకరనారీపిశాచి | 0-12 | వాఁడే వీఁడు | 0-12 |
| ప్రతాపదౌర్జన్యము | 0-12 | హత్యా విచారము | 0- 8 |

# చరిత్రాత్మకమైన నవలలు.

| | | | |
|---|---|---|---|
| వనదుర్గము | 1- 0 | మానసింగు | 1- 0 |
| తపోవనము | 1- 0 | కిశోరి | 1- 0 |
| జపమాలిక పా 1 | 1- 0 | వక్రరేఖ | 1- 0 |
| జపమాలిక పా 2 | 1- 0 | తానీషా | 1- 0 |